సర్వేశ్వరాయనమః






# జ్ఞానోపదేశసంక్షేపము.

## ప్రతిరోజు చెప్పతగిన తిరుమంత్రములు.



మంజువాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

---

ఏలూరు.

1922

సర్వేశ్వరాయనమః

# జ్ఞానోపదేశ సంక్షేపము

## ప్రతిరోజు చెప్పతగిన తిరుమంత్రములు.








మాజవాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రించబడియె,
ఏలూరు.



1922

సర్వేశ్వరాయనమః

# తిరుమంత్రములు

## స్లీవగురుతు మంత్రము.

అర్చ్యశిష్టస్లీవయొక్క గురుతుచేత, మాయొక్క శత్రువులనుండి మమ్ము రక్షించుకొనండి, మాయొక్క సర్వేశ్వరా, పితయొక్కయు, సుతునియొక్కయు స్పిరితు సాంతుయొక్కయు నామముచేత.

ఆమెన్ జేసు.

---

## సర్వేశ్వరునియొక్క ఆరు లక్షణములు.

1. ది. సర్వేశ్వరుడు తామైయున్నారు. 2. వది అనాదిగానున్నారు, 3. వది- శరీరము లేకయున్నారు. 4.వది- కడగురుతులేని సకల మేలుల స్వభావముగా ఉన్నారు. 5-వది- ఎందును వ్యాపించియున్నారు. 6-వది-అంతటికిని ఆదికారణమైయున్నారు.

ఆమెన్ జేసు.

---

## జ్యోతిశ్చక్రమంత్రము.

జ్యోతిశ్చక్రాలయందుండెడు మాయొక్క తండ్రి, మీనామము అర్చింపబడునుగాక. మీరాజ్యము వచ్చునుగాక, చిత్తము జ్యోతిశ్చక్రమందు చేయబడినట్లు భూమియందును యబడునుగాక, నానాటికి కావలసిన మాయన్నము మాకు టికియ్యండి. మాయప్పులవారికి మేము ఓర్చినట్లు మాయప

లను మీరు ఓర్వండి. మమ్ము శోధనయందు ప్రవేశింపచేయ
కుండ కీడులోనుండి మమ్ము రక్షించుకొనండి.

ఆమెన్ జేసు.

---

## ప్రియదత్తమంత్రము.

ప్రియదత్తముచేత నిండిన మరియమ్మా వందనము
స్వామియందు, స్త్రీలలోపల ఆశీర్వదింప బడ్డవారు మీ
గర్భఫలమైన జేసు ఆశీర్వదింపబడ్డవారవునే. అర్చ్యశిష్టమరి
యమ్మా- సర్వేశ్వరునియొక్క మాతా పాపాత్ములమైయుండెడి
మాకొరకుగాను ఇప్పుడును మామరణసమయమందును ప్రార్థిం
కొనండి.

ఆమెన్ జేసు.

---

## విశ్వాసమంత్రము.

జ్యోతిశ్చక్రమును భూలోకమును సృష్టించిన సర్వ శక్తి
భుడైన పితయైన సర్వేశ్వరుని అతియోగ్య భక్తిచేత విశ్వసించు
చున్నాను. అతనియొక్క ఏక సుతుడైన మనయొక్క నాథు
డైన జేసుక్రీస్తువును అతియోగ్యభక్తిచేత విశ్వసించుచున్నాను.
ఇతడు స్పిరితు సాంక్తువల్ల గర్భమై యుద్భవించి కన్యమరియమ్మ
నుంచి పుట్టినారు, పోంస్యుపిలాతుకింద ఉపద్రవపడి శిలువయం
దు మొలలుకొని కొట్టబడి, మరణముపొంది సమాధిలో స్థాపింప
బడినారు, పాతాళానకుదిగి మూడవనాడు మృతమైనవారిలో
నుండి లేచినారు. జ్యోతిశ్చక్రాలకు వేంచేసి, సర్వవల్లభుడైన
పితయైన సర్వేశ్వరుని దక్షిణపార్శ్వాన కూర్చున్నారు. అక్కడ
నుండి బ్రతికినవారలకును చచ్చినవారలకును న్యాయతీర్పు చే

చేయవత్తురు. స్పిరితుసాంక్తువును అతియోగ్యభక్తిచేత విశ్వసిం చుచున్నాను. పాత్తులుగానుండేటి అర్చ్యశిష్టసభ అర్చ్యశిష్టవార ళయొక్క సమదితప్రయోజనాన్ని విశ్వసించుచున్నాను. పాపతు యాన్ని విశ్వసించుచున్నాను. మాంసపు ఉత్థానమును విశ్వసించు చున్నాను. నతతమైనజీవాన్ని విశ్వసించుచున్నాను. ఆమెన్ జేసు.

---

## పదికల్పనలు.

సర్వేశ్వరుడు మనకాసతిచ్చిన వేదకల్పనలు పది. మొద టిది-సర్వేశ్వరునికి ఒక్కటికి మాత్రము ఆరాధన చేయుదువు గాక. రెండవది-సర్వేశ్వరునియొక్క తిరునామము వ్యర్థముగా స్వీకరింపక ఉందువుగాక. మూడవది-సర్వేశ్వరునియొక్క ఉత్స వదివసాలు ఆచరింప తలంచుదువుగాక. నాలుగవది-తలితండ్రు లను భయాభిమానముగా నడుపుదువుగాక. అయిదవది-నరహ త్యచేయక ఉందువుగాక. ఆరవది-మోహ అగమ్యాగమనము చేయక ఉందువుగాక. ఏడవది-దొంగలింపక ఉందువుగాక. ఎని మిదవది-దబ్బరసాక్షి పలుకక యుందువుగాక. తొమ్మిదవది-పర దారను అపేక్షింపక ఉందువుగాక. పదియవది-పరులసొమ్ములకు ఆశపడక యుందువుగాక. ఈపదికల్పనలు రెండుకల్పనలలో అణాగుచున్నవి. మొదటిది-సకలవస్తువులమీద పెట్టిన పక్షాని కన్న సర్వేశ్వరునిమీద అధికభక్తికలిగి యుండుట. రెండవది- తన్ను తాను స్నేహించునట్టు సమస్తజనులను స్నేహించుట. ఆమెన్ జేసు.

---

## అర్చ్యశిష్ట సభ కల్పనలు.

### అర్చ్యశిష్టసభ కట్టడచేసిన కల్పనలు ఆరు-

మొదటిది-ఆదివారము అప్పు పండుగలను ఆచరించి నిండుపూజకనుట. రెండవది-ఏడాదికి ఒక్క సారియైనను పాపసంకీర్తనముచేయుట. మూడవది-పాస్కపండుగలో సత్ప్రసాదానికి ఆయత్తముగానుండుట. నాలుగవది-శుక్రవారము, తపస్సుకాలము మొదలైన శుద్ధభోజన దినములందు మాంసమునువర్జించి అర్చ్యశిష్ట సభ కట్టడచేసిన దినాలలో ఒక్కపొద్దుగానుండుట. అయిదవది-తొలగింపబడిన కాలమందును, తక్కువ ప్రాయమందును, విఘ్నముగల చుట్టరికమందును వివాహము చేయకనుండుట. ఆరవది-ఘనవిచారణ గురువుల సంరక్షణకుగాను సహాయముచేయుట, ఆమోకేను.

---

## పాపసంకీర్తన మంత్రము.

సర్వశక్తుడైన సర్వేశ్వరునితోనున్ను, ఎప్పుడును కన్యకగానుండెడి ముక్తిబొందిన అర్చ్యశిష్టమరియమ్మతోనును, ప్రధానసమ్మనస్కుడుగా నుండెడి మోక్షభాగ్యవంతుడైన మిఖేలుతోనున్ను, స్నాపకుడైయుండెడి మోక్షభాగ్య వంతుడైన అర్లప్పతోనున్ను, అర్చ్యశిష్ట అపోస్తులైన రాయప్పతోనున్ను, చిన్నప్పతోనున్ను, సకలఅర్చ్యశిష్ట వారలతోనున్ను, నాకు గురువులై యుండెడి మీతోనున్ను, పాపసంకీర్తనము చేయుచున్నాను. ఏలననిన విచారముచేతనున్ను వాక్కుచేతనున్ను క్రియలచేతనున్ను బహుపాపాలు చేసితిని. నామీవతప్పు, నామీవలతప్పు, నామీదదొడ్డతప్పు. అందుచేత ఎప్పుడును కన్యకగానుండెడి ముక్తిబొందిన అర్చ్య శిష్టమరియమ్మనున్ను ప్రధానసమ్మనస్కుడుగానుండెడి

మోక్ష భాగ్యవంతులైన మిఖేలునున్ను, స్నాపకులై యుండెడి మోక్ష భాగ్యవంతులైన అర్లప్పనున్ను, అర్చ్యిశిష్ట అపోస్తులైన రాయప్పనున్ను, చిన్నప్పనున్ను, సకల అర్చ్యశిష్టవారలనున్ను, నాకు గురువులై యుండెడి మిమ్మున్ను మనకు కర్తయై యుండెడి సర్వేశ్వరుని నాకొరకై వేడుకొమ్మని వేడుకొనుచున్నాను. .

ఆమెంజేసు.

---

### ఉత్తమ మనస్తాపమంత్రము.

సర్వేశ్వరాస్వామీ, దేవరవారు కడగురుతులేని సకల మేలులస్వభావముగా నుంటుటవలన అంతటికన్న మిమ్ము నేను స్నేహించియున్నాను స్వామీ, మీకు పొందని పాపాలనునేను చేసినందువల్ల మహామనస్తాపముగానున్నాను స్వామీ, మహాదుఃఖముగానున్నాను స్వామీ, మహాఉత్తమ మనస్తాపముగానున్నాను స్వామీ, ఇకమీదట ఒక్కనాటికి ఇటువంటిపాపాలనుచేయుటలేదని గట్టిమనస్సుతో ప్రతిజ్ఞ చేయుచున్నాను స్వామీ, జేసునాధస్వామి పాటుబడి చిందపోసిన తిరురక్తఫలాలుమూది నాపాపాలన్ని ఓర్చి నాకు మోక్షభాగ్యమిత్తురని గట్టిగా నమ్మియున్నాను స్వామీ, అర్చ్యశిష్టసభ విశ్వసించి యుపదేశించునదంతాను తప్పులేని సత్యస్వరూపిగానుండెడి దేవరవారే మనకానతిచ్చినందువల్ల, అనుమానములేక పరిపూర్ణ విశ్వాసముతో నిండుమనస్సుతో నిశ్చయించుచున్నాను స్వామీ. ఆమెంజేసు.

---

### త్రిత్వ స్తోత్రము.

పితకును సుతునికిని స్పిరితు సాంతునకు స్తోత్రములు గలుగునుగాక.

ఆదిలో కలిగినట్లు ఇప్పుడును ఎప్పుడును అనాది సదాకాలమును కలుగునుగాక. ఆమెన్ జేసు.

---

## దైవికపుణ్యక్రియలు.

### విశ్వాసక్రియ.

నాసర్వేశ్వరస్వామీ, అర్చ్యశిష్టసభ విశ్వసించి చదివించెడి సత్యములన్నిటిని సత్యస్వరూపిగానుండు దేవరవారు తామే తెలియచేసినందువల్ల నేనుసదృఢముగా విశ్వసించుచున్నాను.

### నమ్మికక్రియ.

నాసర్వేశ్వరా స్వామీ, సర్వసమ్మతమునకు పాత్రులుగానుండు దేవరవారు వాగ్దత్తము చేసినందువల్ల నేనునాథస్వామి పాటుబడిన పుణ్యఫలములను జూచి నాపాపములన్ని ఓర్చి నాకు మీయొక్క వరప్రసాదములను మోక్షభాగ్యమును కృప చేయుదురని దృఢముగా నమ్మియున్నాను.

### దేవస్నేహక్రియ.

నాసర్వేశ్వరా స్వామీ, సకలమేలులకు స్వభావముగానుండు దేవరవారు మట్టులేని స్నేహమునకు పాత్రులుగానుండుటవల్ల అంతటికన్న మిమ్మునేను నిండుమనస్సుతో స్నేహించుచున్నాను. నాసర్వేశ్వరా మిమ్ముజూచి నన్ను నేనుస్నేహించెడు ప్రకారము సమస్తజనులను నేను స్నేహించుచున్నాను. ఆమెన్ జేసు.

---

### సువిశేషపు మేలైన బుద్ధులు మూడు.

1-వ స్వేచ్ఛగలదరిద్రము. 2-వ ఎడతెగని విరక్తత్వము 3-వ సంపూర్ణమైన విధేయత అ. జే.

ప్రధాన సత్క్రియలు మూడు,

1-ది దానము. 2-ది జపము. 3-ది ఉపవాసము.

ప్రధానమైన పుణ్యములు నాలుగు.

1-ది వివేకము. 2-ది నీతి. 3-ది మనోదృఢము 4-ది పరిమితి-

పగదీక్ష పరలోకమువరకు మొఱబెట్టెను

పాపములు నాలుగు.

1-ది కావలెనని నరహత్య చేయుట. 2-ది స్వభావమున కు తగని మోహ పాపము చేయుట. 3-ది బీదలను విధవరాండ్లను తల్లిదండ్రులు లేని వారలను చెఱచుట. 4-ది పనిచేసినవారలకు కూలి ఇయ్యకనుండుట.

మనుష్యులయొక్క ముగింపులు నాలుగు.

1-ది మరణము. 2-ది తీర్పు. 3-ది నరకము. 4-ది మోక్షము.

తలమైన పాపములు ఏడు.

1-ది అహంకారము. 2-ది కోపము. 3-ది మోహము. 4-ది లోభితనము. 5-ది భోజనప్రియము. 6. ది మాత్సర్యము. 7-ది సోమరితనము.

తలమైన పాపములకు విరోధమైన పుణ్యములు ఏడు.

1-ది అహంకారానికి విరోధము మనదీనత. 2-ది కోపానికి విరోధము ఓర్పు. 3-ది మోహానికి విరోధము విరక్తత్వము. 4-ది లోభితనానికి విరోధము ఔదార్యము. 5-ది భోజనప్రియానికి విరోధము మితభోజనము. 6ది- మాత్సర్యమునకు విరోధము స్నేహము. 7-ది సోమరితనానికి విరోధము చురుచురుకు.

శరీరసంబంధమైన పుణ్యములు ఏడు.

1-ది ఆకలికొన్నవారికి అన్నము పెట్టుట 2-ది దాహము కొన్నవారికి దాహముగకిచ్చుట. 3-ది వస్త్రము లేనివారికి వస్త్రము

ము ఇచ్చుట. 4-దివరదేశులకు తనయింట్లో జాగాయిచ్చి పరామరించుట. 5-ది కావలిలోనుండెకి వారలను వ్యాధిగానుండెను వారలను సంధించుట. 6-ది అడిమెలను విడుదలచేయుట, 7-ది చనిపోయినవారిని ఎత్తి భూస్థాపితముచేయుట.

ఆత్మసంబధమైన పుణ్యములుఏడు.

1-ది సందేహించెడి వారలకు బుద్ధిచెప్పుట 2-ది వేదశాస్త్రముల నెరుగనివారలను చదివించుట. 3-ది పాపాత్ములను తిప్పుట. 4-ది కష్టిపడెడువారలకు ఆదరువల చెప్పుట. 5-ది నిందించెడువారలనుమన్నించుట 6-దికష్టపరచెడు వారలనుఓర్పుతోసహించుట. 7ది-జీవితులకొరకును మృతులకొరకునుసర్వేశ్వరుని వేడుకొనుట.

స్పిరితు సాంక్తుమైన సర్వేశ్వరుని

వరప్రసాదములు ఏడు.

1-ది జ్ఞానము. 2-ది బుద్ధి. 3-ది విమర్శ. 4-ది దృఢము. 5-ది తెలివి. 6-ది భక్తి. 7-ది దేవభయము.

స్పిరుతు సాంక్తుమైన సర్వేశ్వరునియొక్క

జ్ఞానఫలములు పండ్రెండు.

1-ది పరస్నేహము. 2-ది జ్ఞానసంతోషము. 3-ది సమాధానము 4-ది ఓర్పు 5-ది దయ 6-ది మేలెరిగినతనము. 7-ది తాళిమి 8-ది శాంతము. 9-దివిశ్వాసము 10-ది మర్యాద 11-ది నిగ్రహము. 12-ది విరక్తత్వము.

స్పిరుతుసాంక్తుమైన సర్వేశ్వరునికి

పొందని పాపములు ఆరు.

1-ది సర్వేశ్వరునియొక్క దయను అధికముగానమ్మి పాపములకు తెగించుట. 2-ది సర్వేశ్వరుని దయమీద అపనమ్మికవడుట. 3-ది తెలిసియువిరోధించుట. 4-ది ఇతరులయొక్క మేలు

మీాద అనూాయవమటు. 5-డి పాపములో మూర్ఖముగానుండుట.
6-డి మరణపర్యంతము తపముచేయకనుండుట.

ఇతరులు పాపములో బడుటకు
కారణముగానుండెడి తొమ్మిదులు తొమ్మిది.

1-డి ఇతరులకు దుర్బుద్ధిచెప్పుట. 2-డిపాపముచేయ ఆజ్ఞాపించుట 3-డి పాపమునకు సమ్మతించుట 4-డి అందుకు ధైర్యము కలుగజేయుట. 5-డి దానిని పొగడుట. 6-డి దానిని బైలు పరచవలసినప్పుడు మరుగుజేయుట. 7-డి అందుకు సహాయము గానుండుట. 8-డి అందుకు మౌనముగానుండుట. 9-డిదానినికాపాడుట ఆమెన్ జేసు.

త్రికాలజపము.

ఏలినవారియొక్క సన్మనస్సు మరియమ్మతో విశేషము చెప్పెను. ఆయమ్మ స్పిరితుసాంతువల్ల గర్భముధరించెను. ప్రియదత్తమంత్రము.

ఇదిగో యేలినవారియొక్క దాసిరాలను మీారుమందలించిన మాటచొప్పున నా కవునుగాక. ప్రి.

సుతుడైన సర్వేశ్వరుడు మనుష్యావతారము చేసిరి. మరియు మనతోకూడా వాసమైయుండిరి. ప్రి.

వ. జేసుక్రీస్తునాథుని వాగ్దత్తములకు మేము పాత్రులమగునట్లు,

ఆ. సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాతా,మాకొరకు వేడుకొనుము.

ప్రార్థించదము.

సర్వేశ్వరా స్వామీా, సన్మనస్సు చెప్పినందువల్ల మీాకు

బిడ్డగానుండెడు జేసుక్రీస్తువు మనుష్యుడైనది తెలుసుకొంటిమి. వారియొక్క పాట్లవల్లనను స్లీవవల్లనను ఉత్థానముయొక్క మహిమను మేము పొందునట్లుగా మాకు అనుగ్రహము చేయ నవధరింపవలెనని దేవరవారిని వేడుకొనుచున్నాము. ఈ వేడుదల వం తా జేసునాథ స్వామియొక్క దివ్యముఖమును జూచి మాకు దయచేయుండి. ఆమెన్ జేసు.

---

## కృ పా ర స ము ం త్ర ము.

కృపా రసముగలమాతయై యుండెడు రాజ్ఞీ వందనము మాజీవమా! మామధురమా! మాశరణమా వందనము. పరదేశులమైయుండెడు మేము ఏవయొక్క బిడ్డలము, మిమ్ము జూచి మొరబెట్టుచున్నాము. ఈకన్నీటికనమయందు ప్రలాపించి ఏడ్చులై మిమ్ముజూచి నిట్టూర్పు విడుచుచున్నాము. అందువల్లమాకొరకుమనవిచేసెడుతల్లీ మీదయారసముగల దివ్యకన్నులను త్రిప్పనవధరించండి. ఇదిగాక ఈపరదేశముగడిచినతరువాత ఆశీర్వదింపబడిన మీదివ్య ఉదరఫలమగు జేసునాథునియొక్క ప్రత్యక్షమైనదర్శనమును మాకియ్యనవధరించండి. కృపగలిగినతల్లీ, దయారసముగలిగినతల్లీ, ఓమధురమైన కన్యమరియమ్మా.

వ. జేసుక్రీస్తునాథునియొక్క దివ్యవాగ్దత్తములకు మేము పాత్రులమగునట్లు.

ఉ. సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాతా, మాకొరకుగాను వేడుకొనండి.

అజ్ఞానులు జ్ఞానోపదేశమును వినునట్లుగా
స్వామిని వేడుకొనుట.

అనాదియును సమస్తమును సృష్టించిన వారునైయుం

డెను సర్వేశ్వరా! దేవరవారుఅజ్ఞానులయొక్క ఆత్మలను మీ పోలికగాకలుగజేసితిరే, ఇదుగో మీకు అపకీర్తిగా వారలయొక్క ఆత్మలనుంచి నరకమేనింపుచున్నది. వారలను రక్షించి బ్రతికించుటకు మీదివ్యకుమారుడైన జేసునాథుడు స్లీవయందుకఠినమైనమరణముపొందినారే, నాయేలినవారా! దేవరవారి కుమారునికి ఇకను అజ్ఞానులనుండి అపకీర్తివచ్చుటవలన ఉపేక్షచేయక దయచేసివారల. అజ్ఞానమునున్ను, మూర్ఖతనమునును చూడక లెక్కలేని పుణ్యాత్ములును మీదివ్యకుమారునిమీద భక్తిగానుండెను అర్చ్యశిష్టసభయావత్తును వారలకొరకు మీకుఒప్పగించెను జపతపదానధర్మములను కృపకటాక్షముతో చూచి కరుణించండి. లోకమంతటిని బ్రతికించి రక్షించుటకు మీరుపంపిన జేసునాథుని ఎన్నటెన్నటికి కీర్తిగలిగి యుండెడులాగున అజ్ఞానులందరును వారి నీతినివినునట్టు పాలించ కరుణించండి

ఆమెన్ జేసు.

1 జ్యోతి. 1 ప్రియ. 1 త్రిత్వం.

వేదసాక్ష్యులకురాజ్ఞీ - మాకొరకు వేడుకొనుము.

హిందూదేశమునకు అపోస్తులులైన అర్చ్యశిష్టతోమామువారా అర్చ్యశిష్ట ఫ్రాంచిస్కశవెరివారా మాకొరకు వేడుకొనండి.

---

## దైవస్తుతులు.

దేవుడు స్తుతింపబడుదురుగాక.

వారిపరిశుద్ధనామము స్తుతింపబడునుగాక.

నిజదేవుడును నిజమనుష్యుడునైన జేసుక్రీస్తు స్తుతింపబడుదురుగాక.

జేసువుయొక్కనామము స్తుతింపబడునుగాక. వారియొక్క

అర్పితహృదయము స్తుతింపబడును గాక.

పీఠముయొక్క మిగులపరిశుద్ధదేవ ద్రివ్యానుమానమందు దేవుడు స్తుతింపబడుదురుగాక.

దేవుని గొప్పతల్లియగుమిక్కిలి పరిశుద్ధమరియమ్మ స్తుతింపబడుదురుగాక.

వారిపరిశుద్ధమును నిష్కళంకమునైన ఉద్భవము స్తుతింపబడునుగాక.

కన్యకయును తల్లియునైన మరియమ్మగారి నామముస్తుతింపబడునుగాక.

వారియొక్క మహావిరక్తభర్తయగుఅర్చ్య, జోజప్పగారు స్తుతింపబడుదురుగాక.

తమదూతలయందును తమఅర్చ్యశిష్యులయందును దేవుడు స్తుతింపపడుదురుగాక.

సర్వేశ్వరాయనమః.

# త్రికాలజపము.

పలినవారియొక్క సన్మనసు మరియమ్మతో విశేషము చెప్పెను. ఆయమ్మ స్పిరితుసాంక్తువునల్ల గర్భముధరించెను.

ప్రియాద త్తమంత్రిము.

ఇదిగో పలినవారియొక్క దాసిరాలను మీరుమందలించిన మాటచొప్పున నాకవునుగాక. త్రి...

సుతుడయిన సర్వేశ్వరుడు మనుష్యావతారముచేసిరి.

మరియుమనతో కూడా వాసముయియుండిరి. ప్రి.

వ. యేసుక్రీస్తునాథుని వాగ్దత్తములకు మేముపాత్రులమగునట్లు.

ఉ. సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాతా మాకొరకు వేడుకొనుము.

పా్ర ర్థిం చు ద ము.

సర్వేశ్వరాస్వామీ, నమ్మనన్ను చెప్పినందువల్ల మీకుబిడ్డగా నుండెను యేసుక్రీస్తువు మనుష్యుడయినది తెలుసుకొంటిమే. వారియొక్క పాట్లవల్లనున్ను స్లీవవల్లనున్ను ఉత్థానముయొక్క మహిమను మేము పొందునట్లుగా మాకు అనుగ్రహముచేయున వధరింపవలెనని దేవరవారిని వేడుకొనుచున్నాము. ఈవేడుదల నంతా యేసునాథస్వామియొక్క దివ్యముఖమునుజూచి మాకుద దయచేయండి. ఆమెన్-యేసు

---

మంచిక్రీస్తువుడు తెల్లవారి లేచినతోడనే మహాభయభక్తి వినయముతో మోకాళ్ళమీదనిలిచి చేతులుముకిళించి ఏకసర్వేశ్వరునిచూచి చెప్పతగినది.

స్వయంబు, అనాది, అశరీరి, మితిలేని సకల మేలులన్వరూపి, జ్ఞానము, బలిమి, కారణములచేతసర్వవ్యాపి, సర్వానికినికారణులై, మోక్షనరకములకు కర్తగానును, పిత, సుతుడు,స్పిరితుసాంక్తువనెడు త్రిత్వఏక సర్వేశ్వరుడుగానుండెడు నావలినవారా, దేవరవారుమాత్రమేసత్యమైన దైవమైయుండుటవల్ల, మీకుమాత్రముచేయతగిన ఉత్తమమైన దేవారాధన చేయుచున్నాము.

## పరిశుద్ధదేవరతల్లినిచూచి చెప్పతగినది.

స్వామిచేత సృష్టింపబడిన జ్ఞానముకలిగిన వస్తువులలోగా శ్రేష్ఠురాలై యుండెడు అర్చ్యశిష్టమరియా, మీరు మోతువానులనబడిన వారలందరికంటె లెక్కలేని వరప్రసాదములచే అతిశయింపబడి, సర్వలోకాలకును రాజ్ఞిగా నుండుటవల్లనును, ఎవ్వడును పరిశుద్ధ కన్యముద్ర మహిమచెడక నిజమైన సర్వేశ్వరుడును నిజమైన మనుష్యుడును ఒక్కరుగానుండెడు శేసునాథస్వామికి దివ్యతల్లిగా నుండుటవల్లనును ముక్తిపొందిన సకల అర్చ్యశిష్ట వారలకును చేయతగిన సాధారణ ఆరాధనలకంటె మీకుమాత్రిమే విశేషమైన ఆరాధన చేయుచున్నాను.

## సకలమోతువానులగూర్చి చెప్పతగినది.

సకల మోతువానులారా! సర్వేశ్వరుని ప్రత్యతుదర్శనముగా దర్శించుకొని, స్వామికి మీరు మహాప్రియులైన వారలుగా నుండుటవల్లనును, మేలులలో నెలకొనినవారలుగా నుండుటవల్లనును, మీవేడుదలవల్ల, సర్వేశ్వరుడు మీముఖాంతరముగా మాకు అనేక సహాయ ఉపకారములను చేసికొని వచ్చుటవల్లనును, అర్చ్యశిష్టసభ ఆచారముచొప్పున మీకు నమస్కారము చేయుచున్నాను.

## మేలెరిగిన స్తోత్రిము.

సర్వేశ్వరా స్వామీ! దేవరవారు నా యాత్మనును, శరీరమునును, ఏమిలేమినుండి సృష్టించి, ఈఆత్మ శరీరములు బ్రతుకుటకు లెక్కలేని ఉపకారములను చేసితిరే, స్వామీ, మీకేస్తోత్రముకలుగునుగాక.

దేవరవారా! ఈ రాత్రికాలమందు ఒక్క హానియును రాకుండ నన్ను కాపాడి రక్షించితిరే.

దేవరవారా! మీరు పరలోకమునుండి ఈ భూలోకమునకువచ్చి నాకొరకుగాను అనేక కష్టములను అనుభవించి, సిలువయందు కఠినమైన మరణమును పొందితిరే.

దేవరవారా! జ్ఞానస్నాన ముఖాంతరముగా నన్ను మీబిడ్డగాజేసి, మీతిరుమరణముచేత వచ్చిన మట్టులేని ఫలములకు నన్ను భాగస్తునిగాచేయను అవధరించితిరే

దేవరవారా! నేనుజ్ఞానస్నానము పొందినవెనుక, చేసిన పాపాల నిమిత్తము, నన్ను నరకములో త్రోసివేయక, పాపసంకీర్తన ముఖాంతరముగా ఓర్చి సత్ప్రసాదమనెడు దివ్యభోజనమునాకు ఇయ్యనవధరించితిరే.

[illegible]

తన్నునిండుగా సర్వేశ్వరునికి ఒప్పగించెడు
వగయునంగాను.

సర్వలోకాలకును ఏలినవారా! దేవరవారు, నాయాత్మమును, శరీరమునును, పంచేంద్రియాలనును, బుద్ధి, స్మరణ, మనస్సునును, నాకియ్యనవధరించితిరే. ఇవియన్ని మీవశాన కానుకగా ఒప్పగించుచున్నాను. ఈకానుక మీకు ప్రీతియగునట్టుగా, జేసునాధస్వామి చేసినవెలలేని పుణ్యాలతోను, మీకు ఒప్పగించుచున్నాను. కాబట్టి విశేషముగా యీదినముమొదలుకొని నామరణపర్యంతము నేను చేయబోవునదంతా మీకు స్తోత్రముగా చేయుచున్నాను.

సర్వేశ్వరునియొక్క అనుగ్రహము అడిగే
వగయునంగాను.

సర్వేశ్వరా స్వామీ, దేవరవారికి ఎన్నికలేని బలమును,

ప్రియదత్తమంత్రము వేడుకొనుదము.

౧-టి గురుతు పూసలజపము-

సర్వానికి వల్లభులగు పితయైన సర్వేశ్వరా స్వామీ, దేవ
రవారు ఎరిగించిన దివ్యకల్పనలకు విరోధమైన పాపాలనుచేసితిమే
వాటినన్నిటిని దేవరవారి మితిలేని కృపచేత ఓర్చి, ఇకగూాకటదా
నులు సుముద్రిగానడవనున్ను, దేవరవారియొక్క స్తోత్రము ఏదో
క విఘ్నములేక ఎచ్చటనును వ్యాపించిన్ను, ఉత్తరించేస్థలము
లోనుండే ఆత్మలు ఉత్తరింపుదీరి మోక్షభాగ్యమును స్వతంత్రిం
చుకొననున్ను, కృపచేయునవధరించండిస్వామీ. ఆమెన్-జేసు.

పది, జ్యోతి-

త్రిత్వస్తోత్రము చెప్పట.

పరలోకానికి రాజ్ఞిగానుండెడు అర్చ్యశిష్ట దేవమాతా, మే
ముచేసిన ఈపదిపూసలజపమును, మీాస్తోత్రములతో నొక్కటి
గాచేర్చిమీాదివ్యకుమారుడైన జేసునాథస్వామి దివ్యపాదాలయం
దు పదిపుష్పాలవలనే కానుకగా సమర్పించమని మిమ్ముబ్రాధి
ప్రార్థించుచున్నాము.

౧. ప్రియదత్తమంత్రము వేడుకొనుట.

౨-వ గురుతు పూసలజపము.

సర్వానికి వల్లభులగు సర్వేశ్వరా స్వామీ, మేము స్వభావముగా
మహా బలహీనులుగానును తంత్రములచేత ఈడ్వబడిన వారల
ముగాను నుండుటవలన, లోకమంపిశాచి శరీరములవబడే, జ్ఞానశ
త్రువులను మేముజయించి, పాపదోషాలో పడకనును పంచేం
ద్రియముల పీడింపుకు కుంగకనును, ఒక్కప్రార్థ్దుతపవాసములచే
మీావేదమునుఅనుసరించి,సుముద్రిగానడవకృపచేయునవధరించండి.

౧౦-ఓశిక్ష—త్రిత్వస్తోత్రము.

భూలోకానికిరాజ్ఞిగానుండెడు అర్చ్యశిష్ట దేవమాతా పాపాత్ములుగానుండెడు మేముచేసిన ఈ పదిపూసలజపమును మీస్తోత్రములతో నొక్కటిగాజేర్చి మీదివ్యకుమారుడైన జేసునాథస్వామియొక్క దివ్యపాదాలయందు పది ముత్యాలవలనే కాణుకగాసమర్పించుమని మిమ్ముజూచి ప్రార్థించుచున్నాము.

౧. ప్రియదత్తమంత్రము.

3-వ గురుతు పూసలజపము.

సర్వానికి వల్లభులగు సర్వేశ్వరా స్వామీ, మేము ప్రధానపుణ్యాలమగు విశ్వాసము, నమ్మిక, దేవస్నేహము అను వీనియందు పెరుగవలెను, స్పిరితుసాంక్తుపుయొక్క జ్ఞానవెలుతురుగొని, పరమపదవియొక్క ద్రోవబట్టవలెను, లౌకిక ఉద్యోగవనులను మామనస్సుపరిత్యజించి, మీనిత్య రాజ్యమునుమాత్రము కోరినిలువవలెను, సకలమేలులను మీకొరకే చేసికొని రానువు కృపచేయుడి స్వామీ.

ఆమెన్-జేసు.

౧౦-జ్యోతిశ్చ.—(త్రిత్వస్తోత్రము.

ఉదయకాలనక్షత్రముగా నుండెడు అర్చ్యశిష్ట దేవమాతా, పాపాత్ములుగానుండెడు మేముచేసిన యీముప్పదిమూడు పూసలజపము మీదివ్యకుమారుడైన జేసునాథస్వామి దివ్యపాదాలయందు ముప్పదిమూడు నక్షత్రాలవలనే కానుకగా సమర్పించుమని మిమ్ముజూచి ప్రార్థించుచున్నాము.

ప్రార్థించుదము.

అవతరించినదైవమునై కరుణించిన కర్తయునై, మధురముగల రక్షకుడునై యుండెడు కనికరముగల జేసువా, దేవరవారు ఈ భూలోకములో వాసము చేసిన ముప్పదిమూడు సంవత్సరాల పర్యంతము మనుష్యులకు దివ్యమాతృకగా చేసికొనివచ్చిన

సూకృతపుణ్యములను మీదాసులు అనుసరింపనును, దేవరవారు మమ్ము రక్షింపతగ్గట్టుగా మీదివ్యరక్తమంతాచిందించి, పొందినకఠినమరణ ఫలముచేత మేము మోక్షముయొక్క పేరింపభాగ్యము పొంది, మిమ్ము ఎన్నటెన్నటికి దర్శించి, స్నేహించి, స్తుతింపనును కృపచేయునవధరించండి. ఆమేన్-జేసు.

జేసునాధునియొక్క దివ్యనామప్రార్థన.

స్వామీ కృపగాఉండండి,
క్రీస్తువా కృపగాఉండండి,
స్వామీ కృపగానుండండి,
జేసువా మాప్రార్థన వినవధరించండి,
జేసువా మాప్రార్థనపరిహారము దయచేయండి,
పరలోకాన వుండెడు పితయైన సర్వేశ్వరా,
లోకమునురక్షించిన సుతుడైన సర్వేశ్వరా
స్పిరితుసాంతువైన సర్వేశ్వరా,
త్రిత్వంతులైయుండెడు ఏకసర్వేశ్వరా,
నిత్యమైన సర్వేశ్వరునికి సుతుడైన జేసువా,
పితయైన సర్వేశ్వరునికి ప్రకాశమైన జేసువా,
నిత్యకాంతియొక్క జ్యోతియైన జేసువా,
మట్టులేని మహిమగల రాజైన జేసువా,
నీతిసూర్యుడైన జేసువా,
పరిశుద్ధకన్యమరియమ్మకు పుత్రుడైన జేసువా.
మితిలేనిస్నేహమునకు పాత్రుడైన జేసువా,
ఆశ్చర్యము నకు తగినజేసువా,
మితిలేనిబలముగల దేవుడైన జేసువా,
వచ్చెడుయుగాలకు పితయైనజేసువా.

[illegible]

పరమయోచనలకు దూతయైన జేసువా,
కడగురుతులేని ప్రాణగల జేసువా,
మహాఓర్పుగల జేసువా,
మహా శ్రవణముగల జేసువా,
శాంతమనదీనతగల జేసువా,
విరక్తత్వప్రియుడైన జేసువా,
మాన్నివాడైన జేసువా,
సమాధాన దేవుడైన జేసువా,
మా ప్రాణమునకు కర్తయైన జేసువా,
సమస్తపుణ్యములమాతృకైన జేసువా,
ఆత్మరక్షణకాంక్షకుడైన జేసువా,
మా దేవుడైన జేసువా,
మా శరణమైన జేసువా,
దరిద్రులయొక్క పితయైన జేసువా
విశ్వాసులకు నిక్షేపమైన జేసువా,
మంచి మేపరియైన జేసువా,
సత్యప్రకాశమైన జేసువా,
నిత్యజ్ఞానమైన జేసువా,
మట్టులేని మేలుస్వరూపముగల జేసువా,
మా జీవము నుమార్గము నైన జేసువా,
సన్మనస్కులకు పరమానందమైన జేసువా,
పితాపితృలకురాజైన జేసువా,
దీర్ఘదర్శులకు దూరదృష్టియైన జేసువా,
అపోస్తులకు గురువైన జేసువా,
సువిశేషకులకు బోధకుడైన జేసువా,

మాకు దయచేసి రక్షించండి స్వామీ

మమ్ము రక్షించుకొనండి స్వామీ.

వేదసాక్షులకు దృఢమైనదేసువా,
స్తుతియ్యులకు ప్రకాశమైనదేసువా,
విరక్తులకు పవిత్రమైనదేసువా,
సకలమోక్షవాసులకు కిరీటమైనదేసువా,
దేసువా దయావరులై యుండి,
మాపాపముల ఓర్పునవధరించండిస్వామీ,
దేసువా తయాపరులై యుండి,
మాప్రార్థన వినవధరించండిస్వామీ,
ఒక్కచేటురాకుండా,
ఏపాపము రాకుండా,
మీకోపమురాకుండా,
పిశాచితంత్రములలో తగులుకొనకుండా,
ఆకస్మికముగా ఆయత్తములేని చావురాకుండా,
మోహాతంత్రములలో తగులుకొనకుండా.
నిత్యచావురాకుండా,
దేవరవారు ఇచ్చేటు మంచిబుద్ధి మంచివిచారములను
మేము తోసివేయకుండా,
దేవరవారి మనుష్యావతారమనెడు పరమరహస్యమును
జూచి,
దేవరవారి బాల్యమునుజూచి,
దేవరవారి జన్మమునుజూచి,
దేవరివారి దివ్యనడతనుజూచి,
దేవరవారి పరితాపలనుజూచి,
దేవరవారి ఆరాటమునును, రక్తచెమటనుజూచి,
దేవరివారి స్లీవనును, పాట్లనునుజూచి,

దేవరవారి ఉపద్రవ నిర్బంధాలనుజూచి,
దేవరవారి మరణమును, భూస్థాపితమునుజూచి,
దేవరవారి దేహోత్థానమునుజూచి,
దేవరవారి మోక్షారోహణమునుజూచి,
దేవరవారి సంతోషమహిమనుజూచి,
దేవరవారు దివ్యసత్ప్రసాదమును స్థాపించినదిజూచి
స్పిరితుసాంతువుయొక్క ఆగమనమునుజూచి
} మమ్మురక్షించుకొనండి స్వామీ

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క
దివ్యగొర్రెపిల్లయైన జేసువా,
మాపాపాలను ఓర్వండిస్వామీ,
లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క
దివ్యగొర్రెపిల్లయైన జేసువా,
మాప్రార్థన వినవధరించండి స్వామీ,
లోకముయొక్క పాపాలను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క
దివ్యగొర్రెపిల్లయైన జేసువా,
మాకు దయచేసి రక్షించండిస్వామీ

జేసువా మాప్రార్థన వినవధరించండి,
జేసువా మాప్రార్థనప్రకారము దయచేయ నవధరించండి,
వచనము:—ఇప్పుడును ఎప్పుడును ఎన్నటెన్నటికిని,
ఉత్తరము:—ఏలినవారి తిరునామము స్తుతింపబడునుగాక.

ప్రార్థించుదము.

మితిలేని దయారసముగలిగిన జేసువా, మీ అత్యుత్కృష్ట నామధేయము బలిమిచేత మీరునాకు జేసువై యుండవలెను, మీకునేను ప్రియమైనశిష్యుడై యుండునట్లు, చేయకరుణించండి, నాకు జీవమార్గమై యుండే మీదివ్యపేరు నాహృదయమందు

ప్రార్థననవధరించండి. అమృతమైన జేసువా, పరమశాంతమైన జేసువా, నా భక్తికి కారణమైన జేసువా, నా ప్రాణాంత్యసమయములో జేసువాఅనెడు దివ్యవచనము ఉచ్చరించి, అటువంటి పేరుమీద భక్తి అధికముచేత మీకునేను ఐక్యమగునట్లు చేయ కరుణించండి, జేసువా జేసువా. ఆమెన్-జేసు.

---

## వేడుదల.

### ౧. ఉత్తరించెడు స్థలమందలి ఆత్మలకు.

ఉత్తరించెడు స్థలములో నుండెడు ఆత్మలకు ఉత్తరింపు తీరి మోక్షానందము చేరునట్లు అర్చ్యశిష్ట దేవమాతనుతలంచి.

౧-జ్యో. ౧-ప్రి. త్రి. వేడుకొనుట.

### ౨. పాలకులనుగూర్చి వేడుదల.

కావలిగానుండెడు సన్మనస్కులనును ఇతర సన్మనస్కుల నును తాముతాము పేరుగొనిన అర్చ్యశిష్ట వారలనును తలంచి.

౧-జ్యో. ౧-ప్రి. త్రి.

### సమస్తులకు అవసరమైనకార్యములకొరకు.

ఈరాజ్యమునకు స్వాస్థము కలుగనును, యీరాజ్యమునే లెడువారలకు ధర్మబుద్ధియు, క్రీస్తువులకు అధికభక్తియు, అజ్ఞానులకు దేవప్రకాశమును, కష్టపడెడువారలకు సంతోషమును, పాపాత్ములకు పాపపరిహారమును మరణముపొందిన క్రీస్తువులకు మోక్షమును మనకును, మన బంధువులకును, మనకుపకారము, అపకారము చేసెడువారలకును సకల క్రీస్తువులకును, దేవునికృపయును రావలయునని అర్చ్యశిష్ట దేవమాతను తలంచి.

౧-జ్యోతి. ౧-ప్రి. త్రి.

## ౮. సత్యవేద వ్యాపకముకొరకు.

గురువులు ఈరాజ్యమందు ఆరోగ్యముగా నుండునట్లును, గురువులును సన్యాసులును, వర్ధిల్లునట్లును వారలు తలంచిన కార్యములు అనుకూలమగునట్లును, తిరుసభ వర్ధిల్లునట్లును, ధర్మత్రోవలో నడుచునట్లును, అజ్ఞానులు జ్ఞానోపదేశము వినునట్లును, చెడిపోయిన క్రీస్తువులు తమ సత్యవేదమునకు మరలునట్లును, సత్యవేద విరోధులకు మంచిబుద్ధి మంచిజ్ఞానము వచ్చునట్లును, మార్గములందు ప్రయాణముచేసెడు క్రీస్తువులు సురక్షితముగా తమ స్థలముచేరునట్లును, సకల ధర్మకార్యములను సర్వేశ్వరుడు మనకనుకూలపరచునట్లును సకల అర్చ్యశిష్ట వారలను తలంచి జేసునాథస్వామియొక్క దివ్యపాదములకు స్తోత్రముగా.

౧-జ్యో. ౧-ప్రి. త్రి.

---

## అజ్ఞానులు జ్ఞానోపదేశమును వినునట్లుగా స్వామిని వేడుకొనుట.

అనాదియును సమస్తమును సృష్టించిన వారునైయుండెడు సర్వేశ్వరా! దేవరవారుఅజ్ఞానులయొక్క ఆత్మలను మీపోలికగా కలుగజేసితిరే, ఇదిగో మీకు అపకీర్తిగా వారలయొక్క ఆత్మలనుంచి నరకమేనిండుచున్నది. వారలను రక్షించిబ్రతికించుటకు మీ దివ్యకుమారుడైన జేసునాథుడు స్లీవయందు కఠినమైన మరణముపొందినారే, నాయేలినవారా! దేవరవారికుమారునికి ఇకను అజ్ఞానులనుండి అపకీర్తివచ్చుటవలన ఉపేక్షచేయక దయచేసి వారల అజ్ఞానమును, మూర్ఖతనమును చూడక, లెక్కలేని పుణ్యాత్ములును మీదివ్యకుమారునిమీద భక్తిగానుండెడు అర్చ్యశిష్ట సభయావత్తును వారలకొరకు మీకుఒప్పగించెడు జపతప

దానధర్మములను కృపాకటాక్షముతో చూచి కరుణించండి. లోక మంతటిని బ్రోతికించి రక్షించుటకు మీరు పంపిన జేసునాథుని ఎల్లు టికీ కీర్తికలిగియుండె మలాగున అజ్ఞానులందరును వారి నీతిని విను నట్లుపాలించ కరుణించండి. ఆమెన్-జేసు.

1 జ్యోతి. 1 ప్రియ. 1 త్రిత్వం.

వేదసాక్షులకు రాజ్ఞిమాతా రకు వేడుకొనుము.

హిందు దేశమునకు అపోస్తులులైన అర్చ్యశిష్ట తోమాను వారా అర్చ్యశిష్టపాలించిన శపరివారా మాకొరకు వేడుకొనండి.

---

దై వస్తు తు లు.

దేవుడు స్తుతింపబడుదురు గాక.

వారిపరిశుద్ధ నామమును స్తుతింపబడునుగాక

నిజ దేవుడును నిజమనుష్యుడునైన జేసుక్రీస్తుప్రస్తుతింపబ డుదురుగాక.

వారిమిక్కిలిఅర్చిత హృదయము స్తుతింపబడునుగాక

జేసువు యొక్క నామము స్తుతింపబడునుగాక.

పీఠముయొక్క మిగులపరిశుద్ధ దేవ దివ్యానుమానమం దు దేవుడుస్తుతింప బడుదురుగాక.

దేవుని గొప్పతల్లియగు మిక్కిలి పరిశుద్ధ మరియమ్మస్తుతిం పబడుదురుగాక.

వారిపరిశుద్ధమును నిష్కళంకమునైన ఉద్భవము స్తుతింప బడునుగాక.

కన్యకయును తల్లియునైన మరియమ్మగారి నామము సుతింపబడునుగాక.

తమదూతలయందును తమఅర్చ్యశిష్టలయందును దేవుడు స్తుతింపబడుదురుగాక.

---

జేసు మరియమ్మా జోజప్పా, మీశరణముకో నేను కను లుతెరచి సెబ్బరలను చూడకనును తలంచకనును చేయకనును ఉందునుగాక.

జేసు, మరియా జోజప్పా, నాహృదయమునును, ఆత్మ మును మీకు ఒప్పగించుచున్నాను.

జేసు మరియా జోజప్పా, నా కడాపటి అవస్తలో నాకు సహాయము చేయుదురుగాక.

జేసు, మరియా, జోజప్పా, మీసన్నిధానములో సమా ధానముగా ప్రాణమువిడుతునుగాక.

---

గురువు నడిపూజలో సత్ ప్రసాదమును పైకెత్తిచూపునప్పుడు.

జేసుక్రీస్తువా, స్వామీ, దేవరవారియొక్క స్లీవచేతను లోకమునుబోగ్రిది రక్షించితి రనుటవల్ల మిమ్ముఆరాధించి మీకుం స్తోత్రము చేయుచున్నాము.

మమ్మురక్షించిన జేసుక్రీస్తువుయొక్క దివ్యశరీరమా మీకే నమస్కారము, జేసునాధునియొక్క అర్చ్యశిష్టపాట్లా మీకేస్తో త్రముకలుగునుగాక మాపాపాలనుపోగొట్ట నవధరించండిస్వామీ.

గురువు పాత్రమును పైకెత్తిచూపునప్పుడు.

మమ్ము రక్షించిన దివ్యజేసువా మాజీవమా, మీదివ్య గాయములలో నుంచి పారిన దివ్యరక్తమా, మహాపూజ్యముతో మిమ్ము ఆరాధించుచున్నాను. మాపాపవిమోచనార్థముగా మా కుంగానున్ను అనేకులకుగానున్ను ఒలుకబోసిన శ్రీరక్తమా మీకే నమస్కారమున్ను, స్తోత్రములున్ను కలుగునుగాక మాపాపమును

పోగొట్ట నవధరించండి.

మితిలేని శాంతము మితిలేని దయగలిగిన నా జేసునాథుడా మీ అనంతదయచేత దుఃఖపడెడువార్ల పాపదోషాలు ఓర్చుట చాలక పాపమునకు తగినశిక్ష ఓర్చుచునున్నగానున్నవారే ఉత్తరించేస్థలానవుండేటి ఆత్మలు అనుభవించెడు కష్టములు తీర్చుట్లున్న మిమ్ము మన దీనతతో అడిగెడుమనవి ఆలకించి దయతో ఓర్వండి స్వామి మీరక్షణఫలము మోక్షమందు అనుభవించెడు వార్లతోకూడా కలపండి మీ అనంతదయమీద మాత్రము నమ్మికయుంచి ప్రళాయముగా కన్నీళ్ళువిడిచెడు వార్ల ప్రళాపము వ్యర్థముగా ఓర్వదయచేయ నవధరించండి శరీరబలహీనముచేత నున్న పిశాచి తంత్రముచేతనున్న వచ్చేచేట్లుమాడక మీదివ్యరక్తఫలముచేఓర్వదయచేయ నవధరించండి స్వామి. ఆమేన్-జేసు.

౫ రుసల్ ప్రసాదము పుచ్చుకున్నప్పుడు స్తుతులకు యిచ్చునపుడు చేయదగిన జపము.

ఓ—ఇదిగో పుత్రమయినవిందు.

అం—ఇందులో జేసుక్రీస్తునాథస్వామి దివ్యాహారమై యున్నారు.

ఓ—ఇందులో మనకర్తుడుపడిన కష్టాలమీద.

అం—నెనరుపుట్టుచున్నది.

ఓ—ఇందులో ఇష్టప్రసాదచేత.

అం—ఆత్మాలకు తృప్తిగలుగుచున్నది.

ఓ—ఇందులో మోక్షభాగ్యముమీద.

అం—గట్టి నమ్మిక మనకువచ్చుచున్నది.

అందరుచేరి.

మనకర్త జేసునాథస్వామి సత్ప్రసాదములో దివ్యశరీర

ముతో దివ్యరక్తతో దివ్యఆత్మముతో దేవస్వభావముతోకూడ నిజముగా వేంచేసియున్నారని పరిపూర్ణవిశ్వాసముతో నిశ్చయించుచున్నాము స్వామి దేవరవారు సర్వమునకు ఏకకర్తలై యుండుటవల్లనమస్తమోక్షవాసులతో కూడ మీకు ఉత్తమఆరాధన చేయుచున్నాము స్వామీఏకసర్వేశ్వరా స్వామి సమస్తవస్తువుల మీద పెట్టినపక్షమునకంటే దేవరవారిమీద అధికభక్తిగావున్నానుస్వామి మితిలేనిదయగలిగిన సర్వేశ్వరా తండ్రి మిమ్ము మాత్రి మేనమ్మియున్నాము స్వామి మీదివ్యకుమారుడైన జేసునాధస్వామియొక్క వెలలేని దివ్యరక్తఫలము జూచి మాపాపములన్నిటిన్ని ఓర్చి మాకు మోక్ష భాగ్యము యిత్తురని గట్టిగా నమ్మియున్నాము స్వామి.

ఒ—ఇదిగో సర్వేశ్వరునియొక్క దయారూపరుడైన కుమారుడు.

అం—లోకముయొక్క పాపములను పరిహరించెడివారు.

ఒ—ఏర్నివారా దేవరవారు దానుని యందు వేంచేసివచ్చుటకు.

అం—నేపాత్రుడనుగా యున్నానుస్వామి

ఒ—దేవరవారు ఒకవాక్యంమాత్రము ఆజ్ఞతిచ్చితిరంటే.

అం—నాయాత్మరోగములన్ని పరిహారమైపో నాయాత్మ బ్రతుకుచున్నది.

---

నర్త్రసాధ ఆశీర్వాదము యిచ్చేటప్పుడు.

ఓజేసునాధస్వామీ నేనుసాష్టాంగముపడి మీకేఆరాధన చేయుచున్నాము మమ్ములనున్ను మాకుటుంబములున్ను మాస్నేహితులనున్ను మాప్రువకారులనున్ను పరిశుద్ధతండ్రిగారైన పాపుగారినిన్ని తిరుసభవారినందరిని, ఆశీర్వదించుడి యిదిగాక పాపా

త్మలను అజ్ఞానులను మనమతిరుగునట్లు ఆశీర్వదించండి మీ ఆశీర్వాదమువల్ల మాకందరికిన్ని నిత్యజీవము కలుగునట్లు అనుగ్రహించండి. ఆమెన్-జేసు.

స్పిరితుసాంక్తుయొక్క మంత్రము.

స్పిరితుసాంక్తువైన సర్వేశ్వరా! దేవరవారు మాయందు వేంచేయ నవధరించండి. పరలోకమునుండి మీదివ్యప్రకాశ కిరణములు మాపై వ్యాపింపచేయ నవధరించండి. దరిద్రులయొక్కపితా, వరప్రసాదములను ఒసంగెడువారా హృదయములకు దివ్యప్రకాశమా, దేవరవారు మాయందు వేంచేయ నవధరించండి. ఉత్తమయూరార్పా, ఆత్మలకు మధురమయిన విందా, సద్గతికి ఆస్పదమైన ఆదరవా, కష్టములలో సుఖమా, గ్రీష్మములలో చల్లదనమా, యేడ్పులలో ఉపశమనమా, దేవరవారు మాయందు వేంచేయ నవధరించండి. అత్యానంద సంయుక్తమైయుండెడు దివ్యప్రకాశమా, మీ సిర విశ్వాసుల హృదయాంతరంగములను నింపండి. మీ దైవత్వమువినా మనుష్యులయందు అపరాధరహితమైనదియు ఒకటియునులేదు, అశుద్ధమైన దానిని శుద్ధీకరించండి. ఎండిన దానిని ద్రవింపించండి, నొప్పిగానుండెడి దానిని గుణపరచండి. ఒంగనిదానిని ఒంగించండి, నులివెచ్చన నొన్నదానిని ఉష్ణీకరించండి, తప్పిపోయినదానిని క్రమపరచండి, మిమ్మునమ్మిన విశ్వాసులకు మీదివ్య వరప్రసారములు యేడున్ను దయచేయ నవధరించండి, పుణ్యములయొక్క ఫలమును, మంచిమరణమును నిత్యమోక్షానంద సంతోషమును మాకు దయచేయవలయునని దేవరవారిని మహాభయభక్తి వినయ విశ్వాసముతో వేడుకొనుచున్నాము. ఆమెన్-జేసు.

జ్యోతిశ్చక్రమంత్రము.

# రాత్రికాల జపము.

త్రికాలజపమును చెప్పవలయును ౧-వ పేజి.

యిదుగో స్వామీ యీరాత్రికాలము మీసమ్ముఖము నకు వచ్చి ఆరాధన చేయుచున్నాము.

౧. సముద్రముయొక్క నక్షత్రమా, సర్వేశ్వరునికి ప్రియమైన మాతా, నిత్యకన్యకా, పరలోకముయొక్క భాగ్యమైన వాకిలీ;

౨. గాబ్రియేల్ సమ్మనస్కుడు చెప్పిన, స్తోత్రమైన మంగళవాక్యములనువిని. ఏవయొక్క పేరుమార్చి స్థిరమైన సమాధానమును మాకియ్య నవధరించండి.

3. పాపాత్ములకువేసిన సంకెళ్ళువిడిపించి, అంధులకును ప్రకాశమిచ్చి, మాకష్టములన్నిటిని పరిహరించి, మాకు సకలమేలులు రావలయునని వేడుకొనండి.

౪ మిమ్మును మాకు తల్లిగాచూపండి, మాకొరకు మీనుండి జన్మించినస్వామి, మీముఖాంతరముగా మేముచేసిన జపములన్నిటిని, విననవధరింతురుగాక.

౫. ఉత్తమకన్యకా, సమస్తమైనవారలలో శాంతస్వభావమా, మేముచేసినపాపములకు ఓర్పుపొంది, శాంతమును విరక్తత్వమును గలవారలుగా చేయండి.

౬. మేముయేసునాథస్వామిని మోక్షమందుజూచి, సర్వ కాలపర్యంతము సుఖానుభవించునట్లు, పరిశుద్ధనడతమాకిచ్చి, భయములేనిమార్గములో మమ్మునడవండి.

౭. పితయైనసర్వేశ్వరునికి స్తోత్రము, ఉత్తమక్రీస్తునాథునికీర్తి, స్థిరతరసాంత్వనైన సర్వేశ్వరునికి యోగ్యమైనపూజ, ఈ ముగ్గురికి సరిగా ఏకారాధన కలుగునుగాక. ఆమేన్.-శేను

మెరిగిన స్తోత్రము.

ఆత్మశోధన. సర్వేశ్వరుడు మనకు చేసినయుపకారాలన్ని తలంచేది.

సర్వేశ్వరా, దయాసముద్రమైయుండెడు స్వామీ, దేవరవారు, నన్ను మనుష్యస్వభావము లేనిలేని సమయాన సృష్టించి, నాకు శరీరమును ఆత్మమును జీవమును వస్తువులన్ని యూరుంచిన నిమిత్తముగాను.

మరియు దేవరవారా, నేను బహుకాలవరి యంతమున్న న్నిద్రోహాలను చేసినను, దేవరవారునన్ను తల్లితండ్రి సమానముగా కాపాడి రక్షించితిరే.

దేవరవారా, మీరు పరలోకమునుంచి భూలోకానకువచ్చి మనుష్యులకొరకుగాను అనేక కష్టపడి స్లీవమందు కొట్టబడి కఠినమైన మరణమును పొందితిరే.

దేవరవారా నేను అజ్ఞానినై దేవరవారి గురుతును తెలియక మృగమువలెనే యుండునప్పుడు దేవరవారు మీగురుతునుచూపి మీవాక్యకొలదిచ్చి జ్ఞానస్నాన ముఖాంతరముగా నాపాపాలన్ని పరిహరించితిరే.

స్వామీ, నేను జ్ఞానస్నానము పొందినవెనుక తిరిగి నేను చేసిన పాపాలనిమిత్తముగాను నన్ను నరకాన తోసివేయక పాపసంకీర్తన ముఖాంతరముగా నాపాపాలన్నిఓర్చి పత్రుసాదమనెడు దివ్యభోజనము నాకు ఇయ్యనవధరించితిరే.

స్వామీ, నేను ఈప్రొద్దు చేసినపాపాలన్ని నాజ్ఞా పకముకురానును, వానికొరకు నిజమైన మనస్తాపపడను ను. మీసహాయమును కట్టడచేయ నవధరించండి.

---

ఆ త్మ శో ధ న .

పోయిన రాత్రిచేసిన ఆత్మశోధన మొదలుకొని యిూ సమయమువరకు చింతన వాక్కు క్రియలచేత చేసిన పాపము లన్నిటిని తలంచుము.

౧. లేచినతోడనే మంత్రాలు చెప్పినవా.

౨. దేవునియందు భక్తిపుంచక పిశాదియొక్క మంత్ర తంత్రాలు చేయించుకుంటిమా.

౩. కారణము లేకుండా వట్టి ప్రమాణములుచేసితిమా.

౪. ఆదివారమురోజున పూజదినాదినామా పని చేసి నామా.

౫. తలిదండ్రులు గురువులు పంతులు పెద్దలు మొద లయినవారిమాట వింటిమా వార్లకు తగినమర్యాదచేసినామా.

౬. ఎవరిమీదనైనా విరోధముకోపముమాలించుట కొట్టుట జరిపితిమా.

౭. మాటవల్లనేమి తలంపువల్లనేమి ఆశవల్లనేమి మా పాతప్పాలు చేసినామా ఎన్నిసార్లు.

౮. దొంగపనిచేసితిమాఎంతా ఎవరిసొమ్ముకైనానష్టపర చితిమా దొంగలకుసహాయముచేసితిమా.

౯. అబద్ధముచెప్పితిమా,

౧౦. శుక్రవారము మాంసము తింటిమా.

## ఉత్తమ మనస్తాపమంత్రము.

సర్వేశ్వరాస్వామీ, దేవరవారు కడుగురుతులేని సకలమే
లుల స్వభావముగా నుండుటవలన అంతటికన్న యెక్కువనేను స్నే
హించియున్నానుస్వామీ. మీకుపొందనిపాపాలను నేను చేసినం
దువల్ల మహా మనస్తాపముగానున్నాను స్వామీ. మహాదుఃఖము
గానున్నాను స్వామీ- మహా ఉత్తమ మనస్తాపముగానున్నాను
స్వామీ. ఇకమీదట ఒక్కనాటికిని ఇటువంటి పాపాలను చేయు
టలేదని గట్టినమ్మికతో ప్రతిజ్ఞచేయుచున్నానుస్వామీ. యేసు
నాథస్వామి పాటుబడి చిందబోసిన శ్రీరక్తఫలాలు చూచి నా
పాపాలన్ని ఓర్చి నాకు మోక్షభాగ్యమిత్తురని గట్టిగా నమ్మియు
న్నాను స్వామీ. అర్చ్యశిష్టసభ విశ్వసించి యుపదేశించునవం
కాను తప్పలేని సత్యస్వరూపిగా నుండెడి దేవరవారే మనకాస
తిచ్చినందువల్ల, అనుమానములేక పరిపూర్ణ విశ్వాసముతో నిం
డుమనస్సుతో నిశ్చయించుచున్నాను స్వామీ.

ఆమెన్-యేసు.

---

* * * * * * * * *

## ఏబదిమూడు పూసల జపము చేయువిధము.

కడగురుతులేని సకలమేలుల స్వభావముగా ఉండెడు
సర్వేశ్వరా, దేవరవారిసన్నిధిలో జపముచేయుటకు, నేను
పాత్రుడనుగాక ఉండినప్పటికిని, మీ మట్టులేని కృపాకటాక్షమును
నమ్ముకొని మీకు మహిమగానును, దేవమాతకు స్తోత్రముగా
నును, ఏబదిమూడు పూసల జపముచేయుటకు మనస్సుగా
నున్నాను స్వామీ, ఈజపమును భక్తితోచేసి, పరాకులేక
ముగింప మీ సహాయమును కట్టడచేయ నవధరించండి.

సకలపుణ్యములకును విశ్వాసమనెడు పుణ్యము అస్థిభారమై యుండుటవలన ముందుముందుగా విశ్వాసమంత్రము వేడుకొనుట.

దేవమాతయొక్క మూడువిధాల మహిమలను జూచి మూడుదైవికపుణ్యములను అడిగెదువగ.

పితయైన సర్వేశ్వరునికి ప్రియమైన కుమార్తెగానుండెడు అత్యుత్కృష్ట దేవమాతా, మాకుదేవవిశ్వాసమనెడు పుణ్యము కలుగునట్టు మీదివ్యకుమారుని వేడుకొనండి. ౧-ప్రి.

సుతుడైన సర్వేశ్వరునికి పరిశుద్ధతల్లిగానుండెడు అత్యుత్కృష్ట దేవమాతా, మాకుదేవనమ్మిక యెనుపుణ్యము కలుగునట్టు మీదివ్య కుమారుని వేడుకొనండి. ౧-ప్రి.

స్పిరితుసాంక్తువైన సర్వేశ్వనికి మిక్కిలి ప్రియముగల వారుగానుండెడు అత్యుత్కృష్ట దేవమాతా, మాకుదేవస్నేహమనెడు పుణ్యముకలుగునట్టు మీదివ్యకుమారుని వేడుకొనండి. ౧-ప్రి.

త్రిత్వస్తోత్రము.

పితకును, సుతునికిని, స్పిరితుసాంక్తువుకును స్తోత్రముకలుగునుగాక.

ఆదియందుండినట్టు, ఇప్పుడును, ఎప్పుడును సదాకాలము స్తోత్రము గలుగునుగాక.

నిజమైన సర్వేశ్వరుడును నిజమైన మనుష్యుడును ఒకరుగానుండెడు శేసునాథస్వామి, మనకునేర్పించిన జ్యోతిశ్చక్ర మంత్రమును వేడుకొనుదుముగాక.

సంతోష దేవ రహస్యములు.

మొదటిది.

గాబ్రియేల్ సన్మనస్కుడు సర్వేశ్వరుని దూతగావచ్చి

మతుండైన సర్వేశ్వరునియొక్క మనుష్యావతార వర్తమానము మరియాకు తెలిపినసమయమందు, అర్చ్యశిష్ట దేవరతల్లీ, మీకు వచ్చిన సంతోషమును తలంచి జపము చేయుచున్నాము.

౧౦-ప్రి., ౧త్రి.

ఈగురుతును సమర్పించెడువగ.

సన్మనస్కులలో ప్రధానసన్మనస్కుడుగానుండెడు అర్చ్యశిష్ట మిఖయేల్ సన్మనస్కుడైనవారా, మేముచేసిన ఈపదిపూసలజపమును, అర్చ్యశిష్ట దేవరతల్లి దివ్యపాదములయందు పది పుష్పములవలనే కానుకగా సమర్పించుడని మిమ్ము జూచి ప్రార్థించుచున్నాము. ౧౦-జ్యోతి.

రెండవది.

ఎలిసబేతమ్మ గర్భములోనుండెడు శిశువు అర్చ్య మీదివ్యకుమారుని మహిమనుజూచి కదిలి నమస్కారముచేసిన సమయమందు, అర్చ్యశిష్ట దేవరతల్లీ, మీకువచ్చిన సంతోషమును తలంచి జపముచేయుచున్నాము. ౧౦-ప్రియ., ౧-త్రిత్వ.

ఈగురుతును ఒప్పగించెడు విధము.

సన్మనస్కులలోగా ప్రధానసన్మనస్కుడుగా అర్చ్యశిష్టగా బ్రియేల్ సన్మనస్కుడయినవారా, మేముచేసిన ఈపదిపూసల ..............పదిముత్యములవలనే..................

౧-జ్యో.

మూడవది.

మీదివ్యకుమారుడు బెత్లెహేము పట్టణమందు పశువుల కొట్టములో పుట్టిన సమయాన, అర్చ్యశిష్టదేవరతల్లీ మీకు... సంతోషమును ..................................

౧౦-ప్రియ., ౧-త్రిత్వ.

